# జ్వాలా లేఖిని

(కవిత)

## సాఖీనామా
## సహితం

కళాప్రపూర్ణ

డాక్టర్ దాశరథి

కిన్నెర ప్రచురణలు
సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాదు–18.

JWALA LEKHINI and SAKHI NAMA
Poems by Dr. Dasarathi.



Published by
Kinnera Publications, Hyderabad-13.

First Edition : 1000 Copies
January 1984

Cover Design by Ravi

Distributors :—

1. Andhra Saraswata Parishat
Tilak Road, Hyderabad-500 001.
2. A.P. Book Distributors
3237, Kingsway, Secunderabad-500 003.

Printers :
Madhavi Art Printers
Kutbiguda, Hyderabad-500 027.

**Price : Rs. 5-00**

స్వాతంత్ర్య

సమర

యోధులకు

మృత్యురాక్షసీ కరాళ
నృత్యానికి భీతిల్లని
మృత్యుంజయ మూర్తులార!
మీకిదే నా ప్రేమాంజలి.

# కృతజ్ఞతలు

ఈ కవితా సంపుటికి కావలసిన శ్వేతపత్రం ఉచితంగా

ప్రసాదించిన ఆత్మీయులు

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి

శ్రీ మహమ్మదలీగారికి

ఔదార్యంతో

సర్వాంగ సుందరంగా

ముద్రణ చేసిపెట్టిన

చిరమిత్రులు

శ్రీ ఊట్ల కొండయ్యగారికి

అధినేత

మాధవి ఆర్ట్ ప్రింటర్స్

కుత్బిగూడా, హైదరాబాదు-500 027

ఈ కవితా సంపుటిని కిన్నెర ప్రచురణగా వెలువరించిన

శ్రీ మద్దాళి రఘురామ్‌గారికి

---

ఈ సంపుటిలోని కవితలు వివిధ పత్రికల్లో ప్రచురితములు;

ఆయా పత్రికల సంపాదకులకు ధన్యవాదములు

# ఈ సంపుటిని గూర్చి

నా ఖండకావ్య సంపుటాలు ఇప్పటికి చాలా వెలువడ్డాయి. ఇది అలాటి వాటిలో ఒకటే అయినా- అప్పుడప్పుడూ అనేక సందర్భాలలో వ్రాసిన కవితల సంపుటి అయినా, ఒక ప్రత్యేకత ఏమిటంటే-

ఇందులో, రెండవభాగం సాఖీనామా లో కొన్ని గజళ్ళు, కొన్ని రుబాయీలు ఉన్నాయి. చాలా సభల్లో చదివి వినిపించాను. చాలా పత్రికల్లో అచ్చయినవి. ఛందోవైవిధ్యమే కాక, భావవైవిధ్యం కూడా వాటిలో కనిపిస్తుంది.

తొలిసారిగా తెలుగులో—గజల్‌తో ప్రభావితులై—-ఒకానొక గజల్ ఛందస్సుకు దగ్గరగా—ముత్యాలసరం సృష్టించిన గౌరవం యుగకర్త శ్రీ గురజాడ అప్పారావు గారికి దక్కుతుంది.

ఆ తరువాత చాలా కాలానికి నేను గజల్, రుబాయీ ప్రక్రియలను, ఉరుదూ, హిందీ, ఫారసీ, స్పానిష్ భాషలలో అధ్యయనం చేసి, పరిశోధన జరిపి, తెలుగులో కొంత విస్తృతంగా ఈ ధోరణిలో రచన చేశాను.

ఈ పరిశోధనకు భారత ప్రభుత్వ విద్యా మంత్రాంగములోని సాంస్కృతిక శాఖవారు నాకు మూడేండ్లపాటు సీనియర్ ఫెలోషిప్ ఇచ్చారు. భారత ప్రభుత్వానికి ఈ సందర్భంలో నా కృతజ్ఞతలు.

ఈ సంపుటికి 'జ్వాలాలేఖిని' అని నామకరణం చేస్తే బాగుంటుందని సలహా ఇచ్చిన నా మిత్రులు, కవులు, విమర్శకులు, భావుకులు డాక్టర్ ఆచార్య భావన్ (విజయసగరం) గారికి నా ధన్యవాదాలు. ఈ శీర్షికతో ఒక దీపావళి సందర్భంలో, నేను ఆంధ్రప్రభలో ఒక కవిత ప్రచురించాను. ఆ కవిత ఈ సంపుటిలోవుంది.

మనసు పడే మథననీ, తపననీ కవనంగా మలచడానికి ప్రయత్నిస్తుంటాను. నా ప్రయత్నంలో నేను సఫలుణ్ణి అయిందీ కానిదీ సహృదయులైన పాఠకులు చెప్పాలి. ఒకసారి ఇలా అన్నాను:—

"జీవితమొక వింత ప్రహేళిక
ఒకప్పుడది కాళిక
మరొకప్పుడది కేళిక"

మహాకవులైన కాళిదాసాదులతో పోల్చితే మనమెంత? అనిపిస్తుంది. కాని మనశక్తి కొలది మనం వ్రాయాలికదా! ఈ సందర్భంలో మార్క్-ట్వెయిన్ అన్నమాట జ్ఞాపకం వస్తుంది:—

"నా రచనలు నీళ్ళ లాంటివి ,
మహామేధావుల రచనలు మధువు లాంటివి;
కాని ప్రతి వాడూ నీళ్ళుతాగుతాడు!"

— దాశరథి

# అనుక్రమణిక

# వసంత సేనా వాహిని

సజీవులను రాళ్ళతో కొట్టి
నిర్జీవులనుగా చేసిపెట్టి
శవాలమీద పుష్పవర్షం కురిపించే
దివాలాకోరు లోకంలో
రుధిరోద్గారి వర్షం ప్రవేశించి-మరింత
రుధిర వర్షం కురిపించదని విశ్వసింతాం

రుధిర స్నానంతో రుగ్నమైన జనానికి
మధుర పానం అందించి
మంచి ఆరోగ్యాన్ని కలిగింతాం.

నిరాశా నిస్పృహలు ధరాతలిని
నిర్వీర్యం కావిస్తున్నప్పటికి
శౌర్య ధైర్యాలతో, ఉగాది ఉజ్వల పతాకతో
క్రౌర్య కౌటిల్యాలను సర్వనాశనం చేతాం.

మనకు మారణాయుధాలు లేవు, వాటికంటే
మరీ శక్తిమంతములైన పలాశసుమ పరంపరలు
వసంత సేనా వాహినులు, మన్మథాస్త్రాలు

జ్వాలా లేఖిని

శత శతాబ్దాలకు తరగని అక్షయాక్షర శస్త్రాలు
రుజాగ్రస్త ధనస్వామ్య వ్యవస్థను రూపుమాపగల
ప్రజాచైతన్య ప్రళయ ప్రభంజనాలు
మృదుల, మౌన, సాధుజన నయన ధనుష్టంకారాలు
హృదయాలను పులకింపచేసే అదృశ్య వికావళి ఓంకారాలు
సమృద్ధిగా మనకున్నాయని నిరూపింతాం.

మృత్యువును నిత్యం, ధరాతలిని ప్రజావళికి పంచే
నిత్యమారణహోమ హోతలను నిర్మూలింతాం.
నమ్రంగా, ఆమ్ర వసంగా, ధరణిని మారుస్తాం
కమ్రకంఠాల శాంతికోకిలలతో యేడంతా ఉగాదిగా తీరుస్తాం.

జ్వాలా లేఖిని

# హృదయ కోకిల

నవ వసంతోదయానంద సమయంలో
నా హృదయ కోకిల పలికే గీతంలో
నిస్సహాయులలోని నిరాశను పోగొట్టే
నిస్సీమ శక్తిని కోరుకుంటున్నాను

అవని అనే ఆమ్రశాఖపై చిగిర్చిన
అతి కోమల మానవతా పల్లవాలు ఆరగించి
ప్రశాంత రాగాలాపనలతో ప్రజావళిని
పరవశింపజేసే శక్తిని కోరుకుంటున్నాను

నిరాశా మహాగ్ని తోరణ మాలికలతో
నిరంతరం భీతిల్లజేసే ఈ ప్రపంచంలో
ఆశా వసంత వనాంత పవనాల వీచికలను
అవనికి అందించగల శక్తిని కోరుకుంటున్నాను

అన్నమో రామచంద్రా! అనే మనిషి లేనినాడు
అసలైన ఉగాది ఆనంద రథంమీద వస్తుంది;
ఆ నవరథ సారథినై ప్రజాపథాల మీద
అనుగమించగల శక్తిని కోరుకుంటున్నాను

పండుగనాడు గుండె మంటలను మరచి
ప్రజావళి సంతోషాతిరేకంతో
తర తమ భేదాలు విడిచి జీవించగల
తరుణ సామ్యవాద సాధనశక్తిని కోరుకుంటున్నాను.

నవ హృదయ కోకిలాగళం పలికే శబ్దం
చెవిని పడగానే పరుగెత్తుకొనివస్తుంది నవాబ్దం;
అనంతకాలం అవనిలో వసంతాన్ని ఆపి ఉంచగల,
ఆ ఉగాదిని తేగల శక్తిని కోరుకుంటున్నాను.

జ్వాలాముఖి

# గుండెకు అండ

నా గుండెకు
నేనే అండను
నా ఆత్మకు
నేనే కైదండను
వర్షానదిలా పొంగను
ఇసుక మేటలా క్రుంగను
ఎలాటి నియంతకైనా
ఎలాటి హంతకైనా లొంగను
అదృష్టమే ఆగ్రహించినా
ఆ ప్రళయమే ఆవరించినా
రవ్వంత చలించను
నవ్వుతూ యెదుర్కొంటాను
కష్టాలను ఇష్టపడతాను
నమ్మిన సిద్ధాంతం కోసం నష్టపడతాను
కాలమహాప్రవాహంలో కేళీ విలాసంగా
లీలా విహారం చేస్తుంటాను
కలంలో బలం వున్నన్నాళ్ళు
కవితలు వ్రాస్తూవుంటాను
గళంలో బలం వున్నన్నాళ్ళు
కవితలు వినిపిస్తుంటాను.

జ్వాలా లేఖిని

# త్యాగ జ్వాలలు

దక్షిణాఫ్రికా ప్రభుతకు
దాక్షిణ్యం ఎక్కడిది?
స్వాతంత్ర్య యోధులపై
సానుభూతి ఎక్కడిది?

హిట్లర్ చచ్చాడంటే
ఎట్లా నమ్మేది ?
దమననీతి ఉన్నచోట
తానే ఉండేది !

ప్రిటోరియాలో తన బస
పెట్టుకొని ఉన్నాడు
"స్వాతంత్ర్యం" అన్నవాణ్ణి
చంపేస్తూ ఉన్నాడు

"బోతా!" దయలేని దున్న,
పోతా! కన్నీటి వాన
కురిపించెను విశ్వమంత,
కరగదు నీ గుండె సుంత.

ఉరికంబాలెక్కారు
మరణాన్నే గెలిచారు.
త్యాగ జ్వాలలు జగాన
తమస్సునే కాల్చుజాలు

జ్వాలా లేఖిని

# అంతరంగంలో రంగవల్లికలు

నా హృదయ ప్రాంగణంతో ఈ ఉదయం
సౌహృదంతో వచ్చి వాలిన దేవాంగనా ద్వయం
శ్వేతాంబర, పీతాంబర ధారిణులు
ప్రేమ రంగవల్లికలు అల్లుతున్నారు

శ్వేతాంబరధారిణి సర్తకిలా వుంది
భిన్న భిన్న భంగిమలతో ముగ్గులు పెడుతోంది ;
పీతాంబరధారిణి గాయనిలా వుంది
గీతాలు పాడుతూ ముగ్గులు దిద్దుతోంది

ఆ యిద్దరూ దిద్దిన రంగవల్లికలు
నా హృదయప్రాంగణంలో వెచ్చని అంగారమాలికలు

వద్ద ఒక్కరైనా లేని వాని సందిటిలో
ముద్దుగా యిద్దరు, మనసు ముంగిటిలో !

శ్వేతాంబరి అల్లిన రంగవల్లిక-సౌధం
పీతాంబరి దిద్దిన రంగవల్లిక-రథం

సౌధమంత రథం,
రథమంత సౌధం,

"సౌధం కావాలా? రథం కావాలా?
శ్వేతాంబరి కావాలా? పీతాంబరి కావాలా?"
ఇద్దరూ ప్రశ్నల వర్షం కురిపించారు
వద్దన్నా వినకుండా గుండెగూటిలో చొరబడ్డారు

ప్రశ్నలకు జవాబు చెప్పమని
పట్టుపడుతున్నారు ; — ఒకణ్ణి !

కోపంతో నావైపు చూశారు వారు
"కోరుకో. ఏం కావాలో?" అని అడిగారు

"రథం వద్దు, సౌధం వద్దు,
శ్వేతాంబరివద్దు, పీతాంబరివద్దు"

హిమాంబరం ధరించిన సంక్రాంతి అంబరం
ఈ ధరణికి దిగివస్తే నాకెంతో సంబరం ;
అంతరంగంలోని ఆ రంగవల్లికలు
అంతులేని నా అనురాగ మాలికలు

# వసంతాన్వేషణ

వసంతం వచ్చేసిందని ప్రకటించేశారు;
వసంతానికి స్వాగతం చెప్పడానికి ఎదురేగాను

వనాంతాలకు వచ్చిందనుకుని అటు వెళ్ళాను
వనాలు నరికిపారేశారు, జనాలు బస చేశారు !

వసంతం, కవుల కవితల్లోనైనా వుంటుందనుకున్నాను
ప్రళయార్భటులు, ప్రభంజనాలు దర్శించుకున్నాను !

విషాదాంత, వివాదాంత రచనలు
విప్పితే పత్రికా ప్రపంచంలో కోకొల్లలు !

ఇంతకీ, వచ్చింది, వచ్చింది అన్న వసంతం యెటు
పోయినట్లు ?

గొంతెత్తి తీయతీయగా కోయిలలు యెక్కడ పాడినట్లు ?

మండిపోయే ఈ యెండల్లో వసంత సుకుమారి
గుండె పగిలి మండి మసిబొగ్గయిపోయిందా మరి ?

కాళిదాస రుతుసంహారంలోని కమనీయ వసంతం
కాలం మార్పుకి భయపడి రావడం మానేసిందేమో! పాపం!

## జ్వాలా లేఖిని

వనితా హృదయాల్లో వసంతంకోసం గవేషించాను
ప్రణయానికి బదులు ప్రళయాన్నే సాక్షాత్కరించుకున్నాను
అభినవ్య చిత్రకారుడి చిత్రాల్లో అన్వేషించుకున్నాను
అయోమయ వికృతరూపాలు చూసి భయపడ్డాను

నవగాయకుడి గళంలో ప్రశాంత వసంతరాగం వెతికాను
నన్ను జడిపించే హాలాహల కోలాహలరాగం విన్నాను !

మండిపోయే గుండెల్లో మహీమండలం అంతా గాలించాను
మోడుపడిన లోకంలో నలుమూలలా సంచరించాను

ఆఖరుకి యెవరికీ పట్టని పంచాంగం విప్పిచూశాను
అదిగో ! "వైశాఖమాసః వసంతరుతుః" అని చదివాను
పంచాంగంలో, భయపడి దాక్కున్న వసంత రుతువును
పంచమ ప్రాణంగా లాక్కొని గుండెల్లో దాచుకున్నాను !

# అదృశ్యంకాని హరివిల్లు

ఆకాశంలోని హరి వింటి సోయగాలు
అక్షిగోచరం అవుతాయి కొద్ది క్షణాలు,
స్వాతంత్ర్య దినోత్సవంనాడు సకల భారతావనిలో
సాక్షాత్కరిస్తాయి స్వాతంత్ర్య పతాకాలు

తలవంచని హిమాచలం, రవీంద్రుని కవితను
తలపునకు తెస్తుంది గీతాంజలి గీతంలో ;
తలలు పైకెత్తి, తాము స్వతంత్రులమని తెలుసుకుని
తండోపతండాలుగా నడుస్తున్నారు జనులు పంక్తుల్లో

ఎర్రకోటమీద ఎగిరే జెండా నా హరివిల్లు,
ఈ విశాలభారతావనీ స్వాతంత్ర్యదేవతకు అది ఇల్లు;
స్వాతంత్ర్యదేవతా సహస్ర శిఖరాలయంలో
భారతప్రజ లక్షల, కోట్ల సంఖ్యలో పూజలు జరుపుతున్నారు

స్వతంత్రత-హృదయంలో ఉద్భవించి పెరుగుతుంది
సమస్త ప్రజావళిని ఏకం చేయగలుగుతుంది

అన్ని విభేదాలను మరపించే మహాశక్తి
ఆ స్వాతంత్ర్యదేవత; ఆమె యెడ మనకు భక్తి

గంగకు, గోదావరికి మనకు తేడాలేదు
ఉత్తుంగ హిమాలయానికీ, తరంగిత సాగరానికీ తేడాలేదు
అన్నిటా స్వతంత్రభారతి ఆవహించి ఉంది
ఆమె పావన పాదాలపై నా మనసు ఉంది !

రండి! మువ్వన్నెల పై జయంతి చేపట్టి నడవండి
లెండి ! భేదాలు, వాదాలు వగైరా విడవండి !
తలపైకెత్తిన హిమాలయ శృంగంలా నిలవండి
పలు శతాబ్దాలకూ అదృశ్యంకాని హరివిల్లును చూడండి !

# హరిచాప శకలాలు
# ఆనంద శిఖరాలు

ఇదేమిటి ? ఎక్కడ చూసినా
ఇన్ని ఇంద్ర ధనుస్సులు !
అల నీలి ఆకాశం నుంచి
ఇలకు చిగిన రోచిస్సులు !

మండిపోయే యెండలు గడచి
కుండపోతగా వానలు కురిసి
కర్షకుడు తెలుగు పల్లెసీమలో
హర్ష పులకాంకితుడైతే—

కవీశ్వరుడు—"మేఘదూతం"
కాగల ఒక దివ్య గీతం
విరచించి ముగిపిస్తే
విశ్వజనాళి వీను మరిపిస్తే—

కార్మికుడు కడుపు చేతపట్టుకుని
"ఖర్మరా!" అని వ్యథ చెందకపోతే

ఇల్లాలు, పిల్లలు
చల్లగా జీవించగలిగితే—

కరకు ధనరావణ దశకంఠాలు
ఖండించగల శ్రీరామ బాణాలు

సామాన్య ప్రజాబాహు ధనుస్సుల నుంచి
శత సహస్రాలుగా వర్షించగలిగితే— —.

అది నా స్వాతంత్ర్య దినోత్సవం
అది నా శ్రామిక ప్రజా జయోత్సవం;
ఈ కనిపించే హరిచాప శకలాలు,
లోకానికి కావాలి ఆనంద శిఖరాలు.

# హిమ పాయస చక్రవర్తి

మంచుతో పాయసం వండుకుని లొట్టలు వేస్తూ
మనం సేవిస్తూ వుండడం చిరకాలంగా జరుగుతోంది;
హిమపాయసం యెంత ఆరగించినా—మానవ
హృదయాల్లోని అగ్నిపర్వతం అలాగే వుంది!

ఎప్పుడు చూసినా—ఐస్‌కోన్ చేతపుచ్చుకుని కనపడే
ఈ హిమపాయస చక్రవర్తి
ఇసుమంతైనా శాంతిలేని అంగారధానిక వంటి లోకంలో
యే ప్రజావళికి తెస్తాడు కీర్తి?

మంచు జెండా మహాకాశంలో యెగరేసుకుంటూ
కుంచుకుపోయే హృదయంతో పజపజ వణుక్కుంటూ
పయనించే ఉద్భ్రాంత పథిక చక్రవర్తికి—హిమ
పాయసం మిగులుతుండా ఒక్క చుక్కైనా—వాచవికి?

ఇలా గోళంలోని ప్రతి నాళంలోని రుధిరంలో
యేదో వొక రకమైన తాళంలో
ప్రాణి నృత్యోత్సవం జరుగుతూనే వున్నది!
వద్దన్నా ఈ ఉన్మత్త నృత్యం ఆగనంటున్నది

ప్రకంపనాల, ప్రభంజనాల, అణువిచ్ఛేదనాల,
భయంకర ప్రళయ ప్రయోగాల ప్రోతలకు లోకం
భయభ్రాంతమైవున్నా —మా వాడు, హిమ
పాయసం తినక మానడు! - తిని చల్లబడడు !!

క్షిపణులలో, ఉపరిచలద్వ్యోమ నౌకలలో, న్యూట్రాన్
బాంబులలో
క్షిప్తమైవున్న మృత్యుమహాగ్ని జ్వాలామాలికావళిని
చల్లార్చడానికి హిమాలయమంత హిమపాయసం చాలదు !!
చల్లని హృదయాన్ని కనుగొనడానికి ఈ లోకం చాలదు!!

[ఇది Wallace Stevens రచించిన "The Emperor of Ice Cream" అనే కవితకు అనువాదం ఏమాత్రం కాదు. కాని ఒక జోక్ !

ఈ కవిత చదివి, అమెరికాలో ఒక ఐస్‌క్రీం ఫ్యాక్టరీ యజమాని Stevens కు ఓ లేఖ రాశాడు :-

'ఇంతకీ కవిగారు ఐస్‌క్రీమ్‌కు అనుకూలమా? వ్యతిరేకమా' తెలపమని. కవి నవ్వుకుని వూరుకున్నాడు.

నిజానికి ఈ "హిమపాయస చక్రవర్తి" ఇంకా బాల్యావస్థ లోనే వున్న మానవుని అల్లరి బుర్రకు ప్రతీక ! ]

# స్వాతంత్ర్య మాసపూర్ణిమ

వస్తుంది ఏటేటా ఆగస్టు పదిహేను
వచ్చినప్పుడల్లా పులకిస్తుంది నా మేను

మనం బానిసలం కామని చెబుతుంది మన జెండా
మధుర కవిత ప్రవహిస్తుంది హృదయంగుండా

వసంత ఋతువు ప్రవేశించిన నందనవని
స్వతంత్రతా సుమ సుందర భారతావని

ప్రజలు పరిపాలించుకుంటున్నారు తమను తాము
ప్రజలను కాదని మనం ఏమీ చేయలేము

తిరుగుతోంది జాతి పతాకంపై ధర్మచక్రం
భరతజాతి ప్రజల పరాక్రమం అవక్రం

## జ్వాలా లేఖిని

గంగమ్మ కొంగుచాటున పాలుతాగే బాలలు
గోదావరమ్మ లోగిలిలో ఆడుకునే బేలలు

ఉత్తర దక్షిణాలు, తూర్పు పడమరలు లేవు
ఎత్తైన పర్వతాలు, లోతైన సాగరాలు అడ్డుకావు

నా తల్లి భారతికి నతులే నా వాక్యాలు
భూత, భవిష్యత్, వర్తమానాలకు లొంగవు; అతినవ్యాలు!

స్వాతంత్ర్యమాసం వచ్చింది మనకోసం
పదిహేనవ తేదీ తెచ్చింది సంతోషం

నరాలలో ప్రవహిస్తూంది స్వాతంత్ర్య రుధిరం
భరతజాతీయుల చరిత్ర మధురాతి మధురం.



# పవన చక్రిక

గగన పూత్కృత వాయువీచిక
ఒగము నూయెలలూపు చున్నది;
        పవన చక్రిక తిరుగుచున్నది
        జవన హయమై దుముకుచున్నది

నీలనీరద దుకూలాంచల
కేళిలో తనభాగమేమో
        తెలిసికొనుటకు మాటిమాటికి
        దివికి లంగలు వేయుచున్నది

భూమిలోగల జలము తోడి ధ
రా మతల్లికి 'లాల' పోయగ
        గగనతలమున అలలు రేగే
        గాలిలో ఆటాడు చున్నది

ఎవరి సాయము లేక తిరుగును
ఎవరి అనుమతి లేక ఆగును;
అవని - పదములపైన నిక్కుచు
ఆకసమునే అంటఁ జూచును

పవన చక్రిక వంటిదే ఈ
అవనిపై మానవుని జీవిక;
గాలిలేనిది తిరుగ జాలదు !
కాంచనముపై ఆశ వీడదు !!

# వెన్నెల పాట

నేను లేని రేయి
        నీరు లేని నూయి;

నేను లేని మల్లెతోట
గ్లాని కలిగించు ముళ్ళ బాట;

        నేను లేని ముంగిలి
        నీల తిమిరాల ఎంగిలి

నేను లేని ప్రేయసీ ప్రియుల హృదయాలు
నూనె లేక ఆరి పోనున్న దీపాలు

        నే నున్న ప్రతి రాత్రి
        మానవజీవితాలకు కలుగుతుంది అనురాగంతో మైత్రి

ఎండలోని వేడిని పిండేసిన రేయెండను నేను
గుండెలో వలపున్న వారి మెడలో పూలదండను నేను

వెన్నెల స్నానాలు చేసే రసికులు
వెన్నెలలో భోజనాలు చేసే నాగరకులు
వెన్నెల వలువలతో అందగించే వనితలు
వెన్నెల పతాకాలు ఎగరేసే దేవతలు
అదృష్ట జాతకులు వారు
ఆనంద గీతికలు వారు

వెన్నెల లేని రాత్రులు
విశ్వానికి శత్రులు

జాబిలి లేని గగనం
కౌగిలి లేని యవ్వనం

చాతక పక్షులకు వెన్నెల-అమృతం
రతీ మన్మధులకు వెన్నెల-స్వాగతం
ఒంటరి వారికి నేను అగ్గిని
జంటకు నేను గులాబి మొగ్గను

నేను లేని లోకం
నిజానికి నరకం
నేను ఉన్న లోకం
నిజానికి నాకం

# కాంతి పతాకం

అరుణారుణ కాంతి కిరణాలను
అక్షిగవాక్షాలలోకి చొరనీయక
ఆకాశం నుండి అవనిదాక నిలిచిన
అంధకార భయంకర నీల యవనిక
అశేష ప్రజా నిశ్వాసాగ్ని జ్వాలలకు
అంతరించిపోయిన ఆనంద దినం నేడు

నేడు నేనొక కాంతి పతాకాన్ని ఎగరేస్తున్నాను
నేను నేడొక శాంతి కపోతాన్ని ఎగరేస్తున్నాను;
కాంతి పతాక ధ్వజాగ్ర సీమలో
శాంతి కపోతం క్రీడోత్సవాలు

ఈ మహా పర్వదినం నాడు
ఆ మహాత్ముడు జ్ఞాపకం వస్తున్నాడు:
ఆయనవెంట త్యాగ పతాకాలు చేకొని నడచిన
అశేష స్వాతంత్ర్యయోధులు జ్ఞప్తికి వస్తున్నారు

వారి దారిలో నడవవలసి వుంది
స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవలసి వుంది;
నియంతలు దిగంతాల్లో గంతులేస్తున్నారు
దురహంకారంతో రంతులు చేస్తున్నారు.

భారతీయులంతా ఒక్కటి అని
ప్రపంచానికి చాటి చెప్పాలి రండి !
ఏక కంఠంతో వందేమాతరం అని
ఎలుగెత్తి పలకాలి, లెండి !

# జయ దుందుభి

సాగనంపుదాం ! రండి ! దుర్మతిని
మ్రోగింతాం ! రండి ! విజయదుందుభిని;
నూత్నవత్సరం వచ్చిన శుభ సమయంలో
యత్నింతాం, సాధింతాం, ఉన్నతిని

మోదుగ పూ జండాలు ఎగిరేయి
ఎదలో వలపుల జ్వాలలు రగిలేయి
కొత్తకొత్తగా వున్నది పాతలోకము
ముళ్ళుకూడ పూల వోలె మురిసేయి

నిత్యం హత్యల వార్తలు రావద్దు
సత్యాహింసల వాక్యాలు మరవవద్దు
నిండుప్రాణములు తీయుట మనపనికారాదు
బండగుండె యముని పనిని, మనిషి చేయవద్దు

ఆంధ్రులకు ఉగాది గొప్ప పండుగ
ఈ పండుగ జరపాలి నిండుగా;
గుండె బలంతో బెండల నెదిరించి
గుమగుమలాడాలి మల్లెచెండుగా

జ్వాలా రేఖిని

చెట్టులేని పట్టణాల పాడదు పికము
పండులేని కొమ్మమీద వాలదు శుకము
కవితే ఒక పికముగా, నవతే ఒక శుకముగా
కనిపించాలి ఉగాదికి తెలుగుల జగము

మిల్లుకూత వినిపిస్తే కోకిల పాట
మదిలో వలపుదయిస్తే మామిడితోట
కొత్త కోకతో ఇల్లాలెదురుగ వస్తే
వద్దంటే దొరుకుతుంది ముద్దులమూట !

ధరలో ఉన్నన్నాళ్ళూ 'ధర'లు తప్పవు
ధరలు పెరుగ, నిరుపేదల చెరలు తప్పవు
చాలీచాలని జీతం సంసారికి భూతం;
అవసరాలు తీరక అరకొరలు తప్పవు

నరకాన్ని చేయాలి స్వర్గఖండము
విషం విరిగి, కావాలి అమృత భాండము
హృదయంలో అనురాగం కుసుమించేలా
మదనుడు చేబూనాలి ఇక్షు దండము

# స్నేహ వేదిక

చెరకు గడను చేత బూని రా !
మర ఉపాకీ మాట మరచి పో !
చల్లని సంక్రాంతి వేళ నీ రెండలో
పిల్లల ఆనందాలను చూసి మురిసిపో

కట్టు గుడ్డలేని వానిమీద
కత్తికట్టె చలి
నిరుపేదల పాలిటి కది
నిశ్చయముగ పులి;
ఒంటరిని జడిపిస్తుంది
జంటకు భయపడుతుంది;
చలి – కొందరికి పులి
మరి కొందరికి చెలి!

నీల గగన పతాకమీద రక్తారుణ సూర్యబింబ చిహ్నం,
నీరెండ కాస్తున్నా చలిచలిగా వుంది మధ్యాహ్నం;
ప్రతి మనిషి చేతిలో ఒక రవి కిరణ శలాక
క్రాంతికీ, కాంతికీ, వెచ్చదనానికీ అది ప్రతీక

కయ్యాలాడుతూ, మంచు
గుయ్యారాలలో దొంగసారా ఒంచుకుని
దెయ్యాలు గుంపులు గుంపులుగా, పీకలు
మొయ్యా తాగుతున్నాయి మైకంతో

ప్రణయం హృదయాల్లో ప్రభవిస్తున్నది
ప్రకృతి యువలోకాన్ని కవ్విస్తున్నది:
ఎదురు తిరగండి ఈ చలి తుఫానులపై
ఎదలు కలపండి స్నేహ వేదికలపై.

# మదన ధనుర్భంగం

వసంత సఖుడు మదనుడు
వలవలా యేడుస్తున్నాడు !
అతని చెరకు విల్లు యేమైంది?
అతని పుష్పబాణాల పొది యేమైంది?

యవ్వనం పొటమరిస్తున్న 'అమృతవల్లి' గుండెల్లోకి
అరవింద బాణం వదిలి ఆమెను ఆరాటపెట్టాడు.
గుండెల్లో గుచ్చుకున్న మదన బాణం వల్ల
ఉతకుతలాడిపోయింది ఆ పిల్ల !

మదన వ్యథాతప్తయైన ఆ చిన్నది
మల్లీ సుమశయ్యపై పవళించి యున్నది
వక్షోజాలు పొంగారుతుండగా
వీక్షించింది నావైపు ఆశగా

ఇంతలో మదనుడు మరో బాణం సంధించాడు
ఇప్పుడు ఔరా! నా గుండెకే గురి పెట్టాడు!
ములికిని వదలకముందే మదనుని ఇక్షు ధనువును
ముక్కలు ముక్కలుగా నరికి నమిలేశాను ! !

అందుకే వసంత సఖుడు మదనుడు
అలా వల వలా యేడుస్తున్నాడు!
అతనికి ధనుర్భంగం జరిగింది!
అతని పువ్వుటమ్ముల పొది చెదరిపోయింది!!

# జ్యోతి - హేతి

దేహాలు వేరైనా
ఆవేశాలు ఒకటి:
ఆత్మలు వేరైనా
ఆత్మీయతలు ఒకటి;

శత్రువు శక్తిమంతుడని
చప్పబడి ఊరుకుంటే
చీకటి పెనుభూతం గెలుస్తుంది
లోకబాంధవ బింబం ఓడుతుంది

శంకర భగవత్పాదులు
సౌందర్య లహరిలో చూపిన
"నవీనార్క కిరణం" చేతిలో
"నిబిడ తిమిరం" ఓడింది;

స్వాతంత్ర్య సమరం రైతులు ప్రారంభించారు.
పర పరిపాలకులను మెడలుబట్టి
వెళ్ళగొట్టి గెలిచారు
కళ్ళుతెరిచారు నాడు అమెరికావారు

## జ్వాలా లేఖిని

బోసినోటి గాంధీతాత
పూనిన సత్యాగ్రహంలో
వెల్లబూడిదై పోయెను
తెల్లవాని మహాశక్తి;

పిచ్చని గులాబీల్లాంటి
వ్రేళ్ళతో దివ్వెలు వెలిగించే
కోమలి చేతిలో ఓడింది
క్రూర తిమిర కంఠీరవం;

స్వాతంత్ర్యం గెలిచింది
నియంతృత్వం ఓడింది
జ్యోతి గెలిచింది
హేతి ఓడింది

[బోస్టన్ (అమెరికా)లోని లెక్సింగ్టన్ సెంటర్‌లో ఆంగ్లేయులపై 19 ఏప్రిల్ 1775 నాడు తొలి తుపాకీగుండు పేల్చిన స్వాతంత్ర్యయోధుని (మినిట్‌మన్) బొమ్మవద్ద నుంచుని వ్రాసిన కవిత
(10 అక్టోబరు 1978)]

# దయా నది

ఓయి! దయా నదీ! జగతి కూరక శాంతిని బోధసేయు నీ
తీయని వీచికావళి మదిన్ మధురోహలు రేప సాగెనే!
ఏ యుగమందు పుట్టితివొ యేమొ సుమా! భువనేశ్వరమ్ము నీ
తోయముతో పవిత్రమయి తోచెను మాకొక పుణ్యభూమిగా

ఆకాశమ్ము భవజ్జలమ్ములను మేలద్దమ్ముగాజేసి ఆ
లోకింపన్ తన మోము తానె; రుధిరస్రోతస్సువై నీవు రు
ద్రాకారమ్మున తత్కళింగ రణవేళన్ పొంగుచున్నప్పుడే
శోకంబందె అశోక భూమిపతి విచ్చుంగత్తి చేజారగా

బుద్ధమూర్తి పాదములచెంత కరవాల
ముంచి యెంతగ విలపించె నేమొ?
రణముసేయ ననుచు ప్రతిన గావించెను:
హింస మానుకొనె, అహింస బూనె

నీ తీరాన జపాను బౌద్ధులిదిగో! నిర్మాణముంజేసి రెం
తో తాత్పర్యముతోవిహారమును శాంతుల్దాంతులుప్పొంగ;వీ
చీ తంత్రీ తతిపై తథాగత గుణశ్రీ గానమున్ చేయు నీ
శీతాంభఃకణరాజి, వాయు విహతిన్ చిందెన్ శిరస్సీమలన్

ఎన్ని తలలు తెగెనో? ఎంతెంత రక్తము
భీకరముగ పరుగువెట్టె నేమొ?
రణ భయమ్ము లేని, రక్తపాతము లేని
మహిని మానవుండు మనెడుగాత!

కత్తి, నాడు, తలల నుత్తరించెనుగాని
అణువు నేడు లక్షలాది జనుల
క్షణములోన భస్మమొనరింప జాలు: ఏ
ఆధునిక జగాన అతిభయమ్ము !!

భువనేశ్వర పరిసరముల
ప్రవహించు దయానదీ జల మ్ములలోనన్
కవులు జలాంజలులెత్తుచు
కవితలు రచియించినారు కరుణామయులై

రండు! దయానదీ జలములన్ జలకమ్ములనాడి ధన్యులై
పొండు! తథాగతాలయముపొంత సదా నినదించు ఘంటా
దాండడ నాథముల్ వినుడు! ధ్యాన సమాధినిషణ్ణ భక్తరా
ట్తండము వెంట మంత్ర జప తత్పరులై పరిశుద్ధిపొందుడీ!

ఒరిస్సా రాజధాని భువనేశ్వర్ పరిసరాలలో ప్రవహించేనది దయా నది.

# ప్రజల పంచాంగం

పూలజండా ఎగురవేయాలి
హృదయాలవలపులవాన కురియాలి

తెలుగుతల్లి గృహాంగణాన
ఉగాది పాదంమోపు సమయాన
విజయఘంటలు మారుమ్రోగాలి

లేతవేపకు పూత పూసింది
ముదురు మామిడి కాపుకాసింది

ఆరుకోట్ల తెలుంగులోకమైన
మహాంధ్ర సుందర నందనంలోన
కొత్త కోయిల పాటపాడింది

సుమతిగా దుర్మతిని మార్చాలి
గ్రహములను శాసించి నడపాలి

నవగ్రహములు మంచిమార్గంలో
సంచరించే మంచి సమయంలో
ఆంధ్రజాతికి శుభం కలగాలి

ప్రజల మాటకు తిరుగులేదండి
ప్రజల కోరిక తీరవలెనండి

ధనపిశాచం ఆటకట్టాలి
జన పతాకం కోటకెక్కాలి
శ్రమిక జాతికి విజయమగునండి

మలయ పవనం పాటపాడింది
తెలుగు బృందం నాట్య మాడింది

విశ్వమంతట తెలుగు గీతాలే
వీనులకు విందైన తరుణంలో
ఆంధ్రలోకం మురిసిపోతుంది

దుష్ట శక్తులు తొలగిపోవాలి
కష్టజీవుల బ్రతుకు మారాలి

ప్రజాస్వామ్యం సామ్యవాదంతో
చేయి చేయీ కలిపి నడవాలి
తెలుగుజాతికి కీర్తి పెరగాలి.

# కుసుమ సమయ చక్రం

నిరాధారంగా తిరుగుతున్న
ధరణీ గోళం మీద
నరుడు నివసిస్తున్నాడు
స్థిరత్వం తనదే అనుకుంటున్నాడు!

అజ్ఞానపు ముళ్ళకంచెల్లో
విజ్ఞానపు మల్లెలు విరబూచే
వసంతాగమన శుభ సమయాన
వాస్తవం తెలుసుకోమ్మంటున్నా

నశ్వరమైన విశ్వంభరపై
నరుడూ నశ్వరుడే కదా!
అహంకార ఝంఝారావం దేనికి?
అహంభావ ఢంకాధ్వానం ఎందుకు?

అనుక్షణం మనసు వెంటాడే మృత్యువు
అననీ చక్రానికి ఆజన్మ శత్రువు;
ఆ శత్రువును ఎదిరించడానికి విరిసింది కుసుమం
అది వికసించడానికి సహకరించేదే వసంతం!

## జ్వాలా లేఖిని

ఉగాది జెండా చేత పుచ్చుకుని తిరుగుతున్నాను
జగానికి మృత్యు భయం పోగొడుతున్నాను
ఈ కుసుమ సమయ చక్రం తిరుగుతూ ఉండాలి
కంటకాల కౌగిలిలో పుష్పం పెరుగుతూ ఉండాలి

# యెనభై దాటిన
# ముదుసలి శతాబ్దం

నిశా సింహాసనానికి తానే
నిజమైన వారసుణ్ణి అంటాడు జాబిలి;
పడవ ఉయ్యాలలో పవళించిన నేను
పాలకడలిలో బాలశౌరిని నేనే అంటాను

నిద్ర నా శయ్యాసమీపానికి
నిమిషమైనా రానంటుంది - కలహాంతరిత !
అర్ధ శతాబ్ది తన భుజాలమీద నన్ను
అవలీలగా మోసిన ఈ శతాబ్దం
ఇప్పుడెందుకో భారంగా భావించింది;

తనకు యెనభై దాటాయి
కనుక వార్ధక భారమా ? లేక నాపై
అనాదరమా ? అవజ్ఞా ?

అసలు కాలానికి ముసలి తనమేమిటి ?
అరవై వేలేండ్ల ఏకధారా వర్షంవల్ల

అవని చల్లబడి (సూర్యశకలం కదా!)
అనేక జీవులకు ఆశ్రయ మయింది.

నగ్న నిశ మహోన్మాదంతో తారాతీరంలో
నాట్యం చేస్తోంది వక్షోజాల బరువుతో;
మహర్షుల వలె ఉన్న మహా తరువులకు
మదించిన మదవతిని చూచి మతి చలించింది!

నేను ఉషః కన్యా పాణి పీడనం చేసిన వాణ్ణి
దీన జన క్షీణ హృదయాల చీకటికి పగవాణ్ణి;
అందుకే—జాతి పతాకం ఎగరేసుకుంటూ
ముందుకు పోతున్నా ప్రభాత భేరీలు చూసుకుంటూ.

# కవిత నా సంపద

ప్రభాతాల సందేశాలను మోసుకొచ్చే
ప్రత్యూష వార్తాహరుణ్ణి నేను;
కాంతి సంకేత ధరుణ్ణి నేను;
అంధకార నిశ్శబ్దారణ్యాలలో
ఆరని కాగడాలతో నడిచే కవిని నేను;

నందనారామంలోని మందారాలు
సుందరోద్యానంలోని గులాబీలు
నా అతి నవ్య లేఖినికి సంకేతాలు
నా అభినవ చేతనకు ప్రతీకలు

నా జాతిలో చైతన్యం కలిగించడానికి
నా జాతిని జాగృతి తో వెలిగించడానికి
వ్రాస్తున్నాను కవిత్వాన్ని
వినిపిస్తున్నాను కవితాధ్వనిని,

కళాకౌశలాన్ని కాపాడడం కోసం
రమ్య భావాల నిషాతో రాపాడడం కోసం
నా జీవనాడి నుండి కవితా మధువును
పిండి నా జాతికి అందిస్తాను

నా అనురాగ ప్రేరణనుండి దూరమైనవారు
తమ జీవిత గిరి శిఖరాల నుండి పతన మయ్యారు;
వర్తమాన యాత్రిక బృందం నా గమ్యం వద్ద ఆగి ఉంది
పథం తప్పిన స్వప్నాలకు నా కలం ఆశ్రయం ఇచ్చింది

సంస్కృతి అనే కుసుమం వికసించడానికి సాయం
చేశాను నేను
చరిత్రకు అప్రమత్త జాగరూక నయనాలు ఇచ్చాను నేను
ఎవరి ఆకర్షణ వల్లనో దారి తప్పిన చంచల మృగశాబకం
వంటి సభ్యతకు
ఈ కీకారణ్య మధ్యంలో మార్గం సిద్ధం చేశాను.

# గాఢోపగూఢం

సూర్యుడు అస్తమిస్తాడు
చంద్రుడు ఉదయించడు:
అమావాస్య రాత్రి
అంధకార ధాత్రి

నీలిమబ్బుల పొత్తిళ్ళలో
నిద్రపోతాయి చుక్కలు, పసికందులు:
కుంభవర్షం కురిసి విద్యుత్
స్తంభాలు కూలిపోతాయి

గాలికి ఆరిపోతుంది దీపం
గగనానికి నేలపై ఎందుకింత కోపం ?

అంతటా తపస్సు, తమస్సు, తమస్సు
అప్పుడు ఆరంభమవుతుంది తపస్సు

అప్పుడు రెండు నీడలు వెచ్చదనం కోరి
ఆలింగనం చేసుకుంటాయి మరీ, మరీ:
ఆమె — అతడు
ఆత్మ — పరమాత్ముడు.

# విజ్ఞాన దీపాలు

దీపాల తోటలో దివ్య కుసుమాలు
నర జీవితంలోన నందన వనాలు
అంధకారపు కురులయందు పువ్వుచెండు
అందగించుచు సొగసులందించుచుండు

ప్రతి దివ్వె జీవితం ఒక రాత్రి గాని
బ్రతుకంత ఆ దివ్వె ప్రసరించు కాంతి
జ్యోతియే బ్రహ్మయని ఖ్యాతి గాంచింది
విశ్వప్రజాళికి వెలుగు నిచ్చింది

గుడిసెలోపలి దివ్వె, గుడిలోని దివ్వె-
కాంతి దేవత దాన కనిపించి నవ్వె
ఆమె నవ్వులలోన అమృతాలు కలవు
జ్వాల చూపులలోన స్వర్గాలు కలవు

జ్వాలను తాకితే కాలేను చేయి
మధుకీలికలు సోక మదికెంతొ హాయి
వలపుజ్వాలలోన మాధుర్యముంది
విరహ కీలలలోన వేదనే వుంది

జ్వాలా లేఖిని

మనసు వెలిగించేటి మట్టి దీపాలు
స్నేహమే లేకున్న, చీకట్లపాలు;
జ్ఞాన దీపము నెవడు చల్లార్పఁగలఁడు ?
ఆర్పివేసెడివాడు అవనిలో లేఁడు.

# వెలుగుల గుడారం

దివ్వెల బ్రతుకులు ఒక రేయి
నవ్వుతూనో, రోదిస్తూనో అవి గడిపేస్తాయి

పట్టుమని నగం దినం జీవితం లేని దీపాలకు
పరిసరాలను కాంతింప జేయగల శక్తి ఎందులకు ?

కాంతి లేని కలకాలం బ్రతుకు కన్న
క్షణం వెలిగి ఆరిపోవడం మిన్న

కొవ్వొత్తి కన్నీరు — బుగ్గలపై జారుతుంది
క్రొవ్వెలుగు గులాబీ పువ్వు తలమీద ఆడుతుంది

అగ్ని కుసుమాలతో అలంకరించిన గుడారం
భగ్నజీవులకు ప్రణయాశ లందించే బిడారం

మిన్నెక్కి మన్నును వెలిగించే మేటి సూర్యతేజానికి,
మినుగురు పురుగులోని మిలమిలకీ తేడా దేనికి ?

నాకు కావలసింది కానేకాదు-రాశి
లోకానికి వలసింది వస్తువులోని వాసి

చిరు దివ్వె వెలిగించు! చెలి! అదే చాలు
స్వాంతాన కురియనీ! కాంతి పుష్పాలు

# దోషి - నిర్దోషి

ఒకడు చేసిన నేరానికి
ఒకడు వెళ్లాడు కారాగారానికి:
ఒకడు చెప్పాడు దొంగ సాక్ష్యం
ఒకణ్ణి హింసించడమే అతని లక్ష్యం!

న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు
అతనికి కలిగించలేదు నిట్టూర్పు;
దోషి వీధిలో తిరుగుతున్నాడు
నిర్దోషి ఖైదులో మురుగుతున్నాడు!

# హిమ ఢమరు

హిమ ఢమరు మ్రోగుతున్నది
ఇలాతలం ఊగుతున్నది
నవ వత్సర మహా శివుని
నాట్యం కొనసాగుతున్నది

చిరుగుంటలు పలికించెను శివాలయం
శీత శిలలు కురిపించెను హిమాలయం
శివుని కేశపాశమైన ఆకాశం
శుభ గంగా సుధాఝరీ సురాలయం

మంచు ముసుగు వేసుకొనెను మగువ ధరణి
మగువ మోము చంద్రాయితమైన తరణి!
తరణిని తరుణిగ మార్చిన ఈ హేమంతం
ధరాతలికి చూపింది నూతన సరణి

హిమ పారావత ఖగాలు ఎగసినవి
సమరానల మహోక్షతలు ముగిసినవి:
దుప్పటి, కుంపటి లేని పేదవానికి
నిప్పులాంటి చెలి పెదవులు దొరికినవి

్వాలా లేఖిని

కారుణ్యపు తెలిడెండా ఎగిరించండి
తారుణ్యపు భోగి మంట వెలిగించండి
మదనుడు చెలరేగిన హేమంత ఋతువులా
యోగి, భోగి అను లేచా తొలగించండి

# రజతవైజయంతిక

వెండి జెండా లెగురుతున్నవి
పండువెన్నెల పంటలో?
రాష్ట్ర రజత మహోత్సవంలో
ప్రజలు విసరిన పావురాలో?

తెలుగునకు పర్యాయపదమై
వెలుగు వికసించె;
వెలుగునకు ఆమ్రేడితమ్మై
తెలుగు వినిపించె!

పాతికేండ్ల సమైక్య రాష్ట్రం
జాతి సాధించిన బలం :
ఆంధ్ర వీరుల మహాత్యాగం
అందరికి అందించిన ఫలం

రజత వర్ణ జయంతికలతో
రండి! పండుగ చూడగా;
స్వాంతములు కలగలసిపోగా
ప్రాంత ఖేదము తొలగెగా!

జ్వాలా లేఖిని

తొలగవలె దారిద్ర్య రేఖ
వెలుగవలె సౌభాగ్య రేఖ
కర్షకులు, కార్మికులు, కవులు
కలిసి కృషి చేయుదురుగాక!

# మంగళ జ్యోతులు

అంగనలు వెలిగించే
మంగళ దీపికలు
అంతరంగాల వినిపించే
అనురాగ గీతికలు

తైలంతో వెలిగే దివ్వెల
కాలం పరిమితం,
స్నేహంతో జ్వలించె దివ్వెల
జీవితం అపరిమితం

ఆనవాయితీగా జరుపుకునే
ఆనంద దీపావళి ఒక్క రోజు!
అనురాగ హృదయాలతో దీపావళి
అవిచ్ఛిన్నంగా సాగుతుంది ప్రతిరోజు ! !

అంధకార వనీ ప్రాంగణంలో
అందాల రోజా పూలు
చలి రాతిరి వెలిగే వెచ్చని
సౌందర్య దీపాలు

దివిలో భువిలో అంతట
దీప తోరణాలు కట్టి
పండుగ చేయాలి మనం
ప్రగతిని పొందాలి జనం

ఘర్మ జల కణాలతో
కాంతించే దీపావళి
కర్షక, కార్మిక, కవిగణ
హర్షానికి నివాళి!

# నవ భారతం

ఇంద్ర ధనుశ్శకలాలు ఎగరేస్తూ
ఇందు బింబాల లాంటి బాలబాలికలు

ఏకాండీ దారాల్లా
లోకశాంతికి ద్వారాల్లా
స్వాతంత్ర్య మాస పూర్ణిమా
జయోత్సవాలు జరుపుతున్నారు

ఆసేతు హిమవన్నగం
ఆనందమయం భారతజగం

ఉన్నత భవనాలమీద
చిన్న కుటీరాలమీద
యెన్నెన్ని వైజయంతికలో?
ఏకతా హసంతికలో?

జెండా కొనుక్కోలేని పేదవాడు
గుండెనే జెండాగా ఎగరేస్తాడు

స్వాతంత్ర్యం కడుపునింపదా ?
స్వాతంత్ర్యం బ్రతుకు బరువుదింపదా?

ఆర్థిక వ్యత్యాసాలు
అంతరించేదాకా
అసలైన స్వాతంత్ర్యం రాదా ?
తేడాలపీడా విరగడై పోవాలి
ధనికుల పేదల మధ్య అంతరం
తరిగిపోవాలి సత్వరం

డబ్బుజేబులోవున్నవాడు డాబుసరీగా బతకగలుగు
తున్నాడు
వేలు వంకర పెట్టలేనివాడు వెర్రివాడికింద జమకట్ట
బడుతున్నాడు

కీర్తిదాహం తీరనివాడు
కిరీటంమీద కిరీటం పెట్టినా
గిజగిజలాడి పోతున్నాడు
ప్రజలచేత అందలం మోయించుకుంటున్నాడు

గోడమీద పిల్లులు, క్రొన్నెత్తురు తాగిన నల్లులు
ఏ యెండకా గొడుగులు, యే అడుగులకా మడుగులు;

తమ పదవులు కాపాడుకుంటున్నారు
శ్రమ పడకుండా సుఖపడుతున్నారు
అవకాశవాదం ఈనాటి వేదం
అధికార దాహం అంతులేని మోహం

ధనదేవతా పాదపూజలు ఘనంగా జరుపుతున్నారు
దొంగపూజారులు
ఆ దేవత అనుగ్రహానికి నోచని పేదలు
అగచాట్ల పాలవుతున్నారు
స్వాతంత్ర్యం తెచ్చినవారు
ఆ సమరంలో చచ్చినవారు
ఈవేళైనా జ్ఞాపకం వస్తారా?
ప్రజలు వారికి అశ్రుతర్పణం చేస్తారా?
ఆర్థిక స్వాతంత్ర్య సమరానికి
అందరం సిద్ధంకావాలి శాంతంగా
ధర్మ చక్రాంకిత జాతీయ పతాక
కర్మవీరుల శ్రమఫలితానికి కావాలిప్రతీక
కులం తత్వాన్ని హతమార్చండి
కలం సత్వాన్ని గౌరవించండి
స్వాతంత్ర్య సరోవర జలాలలో
సామ్యవాద సరోజం వెయ్యిరేకులతో విచ్చుకోవాలి
శత సహస్ర కిరణాలతో
శ్రామిక హృదయాకాశంలో చైతన్య సూర్యోదయంకావాలి
నేడు స్వాతంత్ర్య మాస పూర్ణిమ
రేపు ప్రజాతంత్ర దిశలో అరుణిమ
నవభారతం రాస్తాను ఆ అరుణిమతో
యువభారతం చూస్తాను ఆ తరుణిమతో

# గజల్

కవితా ప్రపంచంలో గజల్ ఒక అందాల పూలతోట. వందల సంవత్సరాలుగా అరబ్బీ, ఫారసీ, ఉరుదూ కవులు ఈ తోటను తమ గుండెలు పిండి పెంచి పెద్దచేశారు. ఈ తోటలోని పూల గుబాళింపు విశ్వాన్నే ఉర్రూతలూగించింది.

గజల్ అనే కవితా ప్రక్రియ తొలిని అరబ్బీ భాషలో ఉద్భవించి ఫారసీకి ప్రాకింది. అక్కడినుండి తుర్కీ, ఉరుదూ భాషలలోకి వ్యాపించింది. మానవుని మధుర వేదనకు ఇది ప్రతీక. హృదయాన్ని పెల్లగించి, ప్రణయలత నాటి, కన్నీట తడిపినప్పుడే ఆనందం పుష్పిస్తుంది. కొద్దిపాటి వగపు లేనిది వలపులో సొగసు లేదు కదా! కంటికి కనిపించే లోకంలో లేని వింతలూ విశేషాలు మానవుని మనోలోకంలో ఉంటాయి. మనోలోకాన్ని సాక్షాత్కరింపజేసే సాధనం గజల్. ఇందులోని గులాబీలు, బుల్బులి పిట్టలు ఒకానొక మధుర భావనకు సంకేతాలు. అట్లే మధుశాల, మధువందించే సాకీ—జీవిత వైభవానికి చిహ్నాలు.

బిందువులో సింధువును కుదించినట్లు, అల్పాక్షరాలలో అనల్పమైన భావాన్ని ఇమిడ్చడం గజల్‌లోని విశేషం. ఈ క్లిష్టతకు, నియమ నిబంధనలకు జడిసి కొందరు గజల్‌ను చూలనాడక పోలేదు. కాని, రవ్వను చెక్కడంలో ఉన్న సొగసు రాతి మేడ కట్టడంలో రాదు.

కాలప్రవాహపు రాపిడివలన గజల్ ఎన్నో మార్పులకు లోనైంది. వాయులీనంనుండి మన సంగీతం వెలువడినట్లు గజల్‌లో జాతీయత

తొణికిసలాడింది. గులాబీ, బుల్బులి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు సంకేతాలైనవి. 'శక్తికొలది సాక్షాత్కార'మన్నట్లు గజల్‌లో కనరాని భావ చిత్రంగాని, వినరాని ధ్వనిగాని లేదు. సంగీత సాహిత్యాల రంగరింపే గజల్.

గజల్‌కు గల నిర్బంధాలలో మొట్టమొదటిది అతి క్లిష్టత. ఏ పరిస్థితులలోనూ భావం రెండు పంక్తులలో (ద్విపదలో) ముగిసి తీరాలి. రెండవది, పద్యపాదం తుదిని గల ఖాఫియా, రదీఫ్ అనె నియమాలు ఇవి గజల్ మొదటి రెండు పంక్తులకు సమానంగా ఉంటూ, తరువాత బేసి పంక్తులకు కాకుండా సరిసంఖ్య పంక్తులకే వర్తించడం. ఉదాహరణకు ఈ సంపుటిలోని మొదటి గజల్ పంక్తిలో ఆఖరున ఉన్న 'రానా' అన్న పదం 'రదీఫ్'; విడిచి అన్న పదం ఖాఫియా. రదీఫ్‌గా వాడిన పదం యథాతథంగా 1,2,4,6 పంక్తులలో వస్తుంది. ఖాఫియా, విడిచి, గడిచి, నడిచి ఇలా పై సంఖ్యలలోనె వస్తుంది. ఈ నిర్బంధాలు స్వేచ్ఛగా రచన చేయడానికి అడ్డంకులని కొందరి భావం. ఇవిగాక ఛందస్సు వేరే ఉండనే ఉంది.

ఇంతకూ గజల్ అనే శబ్దానికి అర్థం ఇంతులతో మంతనాలు! వింతగాలేమూ!

# గ జ ల్

## 1

రమ్మంటే చాలు గానీ రాజ్యాలు విడిచిరానా!
నీ చిన్ని నవ్వుకోసం స్వర్గాలు గడిచి రానా !

ఏడేడు సాగరాలు ఎన్నెన్నొ పర్వతాలు
ఎంతెంత దూరమైనా బ్రతుకంత నడిచి రానా !

కనులందు పుంపులాగా కలలన్ని కరగిపోగా
కావేరి వోలె పొంగే కన్నీరు తుడిచి రానా !

నీవున్న మేడ గదిలో నను చేరనీయరేమో
జలతారు చీర కట్టి సిగపూలు ముడిచి రానా !

పగబూని కరకువారు బంధించి ఉంచినారు
ఏనాటికైనగానీ ఈ గోడ పొడిచి రానా !

# కుపితప్రణయిని

## 2

చేరువలో లేకున్నా చిరు నగవులె చాలు
చెలిమి చేయదలచకున్న, చిరు తగవులె చాలు

అడుగగానె ఔనని నన్నాదరించకున్నా
పిలిచినసూ పలకని నీ బిగువులె చాలు

మమత పొంగు నవ సుధువు మా కిడకున్నా
మధువు తడికి మెరిసే నీ పెదవులె చాలు

సన్నజాజి తీవ చెంత సరసం లేకున్నా
నన్ను చూచినంతనె నీ పరుషలె చాలు

ఎద పొలాన విత్తు నాటి వదిలేశావు
వలపు పంట రాకున్నా, కరువులె చాలు!

## 3

ఎవ్వరు మీరు ? ఐ లికలా ?
ఎగిరే దీప జ్వాలికలా !

నవయువ గళ రుధిరముకోసం
నాలుక సాచే కాళికలా !

పువ్వుల చాటుగ కాటిడగా
బుసలిడు భుజగి పాళికలా !

ఒంటరి వారల గుండెలలో
మంటలిడే సుమ మాలికలా !

బ్రహ్మకు రిమ్మను కలిగించే
బొమ్మల వ్రాసే తూలికలా !

ప్రాణస్నేహితులగు వారి
మధ్యన యేర్పడు చీలికలా !

భూలోకాన్నే పాలించే
ఏలికలకె మీరేలికలా ?

అఖిలము తెలిసిన దేవునికే
అర్థముకాని ప్రహేళికలా !

తనువున్నన్నాళ్ళాడినను
తనివే తీరని కేళికలా !

'శరథి' రచించే నాటికల
ముగిపించే నవ చూలికలా !

## 4

ముళ్ళనీడల్లో పువ్వులున్నాయి.
నాదు కన్నీట నవ్వులున్నాయి

కలిమి లేదంచు కలత పడనేలా ?
గవ్వలం దెన్నొ రవ్వలున్నాయి

యాత్ర నడిదారి ఆగిపోనేలా ?
నీల గగనాన దివ్వెలున్నాయి

అడుగు సడి లేని కాళ రాత్రాన
ముదిత పాదాల మువ్వలున్నాయి

ఎగిరి పోలేక వగపు నీ కేలా ?
గుండెలో ఎన్నొ గువ్వలున్నాయి

కరకు చెరలోన కంట నీరేలా ?
తోడుగా నీకు చువ్వలున్నాయి.

# చెల్లు!

## 5

దివ్వెలు వెలిగించగానె మసకలు చెల్లు!
నవ్వులు వొలికించగానె అలకలు చెల్లు!

కాలం గడిచినకొద్దీ ఆలు పాతబడుతుంది
వయసు దాటిపోగానే వలపులు చెల్లు!

అతి పరిచయమైనప్పుడు అలుసవుతుంది
అగుపించిన నాడు పలుకరింపులు చెల్లు!

మలయ పర్వతాన భిల్ల వనితల్లాగా
స్నేహ చందనం కొయ్య పొయిలో చెల్లు!

పరిచయమధికముకాగా చులకన కాదా?
చిరకాలపు అనురాగం త్రుటిలో చెల్లు!

బెట్టు చూపుతున్న చెలియ వెంట పడకుమా!
పట్టినట్టు నటించితే బింకం చెల్లు!

అంది అందనట్లుంటే అనురాగాలు,
అనుక్షణం చెంతవుంటే అంతా చెల్లు!

## 6

ఇన్ని నాళ్ళకు తెలుపమంటివి
ఎందుకోరకే నాపతా ?
నిన్ను బోలిన కరినులకు నే
నెన్నడైనా లాపతా !

అడిగినప్పుడు చెప్పకుండుట
ఎడదగలనా కొప్పదు
ఏ సమయమున నేనెక్కడుందునొ
వ్రాసుకోనే నాపతా

వేగుచుక్కను నిద్రలేపి
విద్యనేర్పే కోర్కెతో
వీణతీగను మీటబోయే
చెలి సఖాగ్రము నాపతా

తెల్లవారేవేళ కమలము
కళ్ళు విప్పేటప్పుడు
బాలభానుడు తొంగిచూచే
ప్రాగ్దిశాగ్రము నాపతా

## జ్వాలా లేఖిని

విరహ జలనిధి దాటిరాగా
ప్రియుడు గౌగిట చేర్చగా
పరవశమ్మున పైట జార్చిన
సఖి భుజాగ్రము నాపతా

శిశిర రాక్షసి గుండెలందున
చిగురుజొంపము లూగగా
పాటపాడే పరభృతముగల
నవ కుజాగ్రము నాపతా

కరకు రాళ్ళే కరగునట్లుగ
కవిత వ్రాసే వేళలో
కాంతి విరిసీ శాంతి కురిసే
కవి కరాగ్రము నాపతా

లోక కంటకుడైన దైత్యుని
పీక ముక్కలు సేయగా
ముక్కునూటిగ ఎక్కుపెట్టిన
హరి శిఖాగ్రము నాపతా

పానశాలావరణమందున
ప్రాణదానము సేయగా
మధువు నొసగె 'సాఖి' లోచన
రోచిరగ్రము నాపతా

విప్లవము వర్ధిల్లువేళల
వీరవర్యుల కనులలో
ధగధగాయిత నవ దవానల
కీలికాగ్రము నాపతా

మంచుకొండల పొంచి చూచే
వంచకుల నెదిరించెడి
భరత సేనా పౌరుషాంచిత
కేతనాగ్రము నాపతా

నేను చేయని నేరమునకై
నిప్పులను విరజిమ్ముతూ
కోపభరమున తావుతాచే
సతి పదాగ్రము నాపతా !

మండిన గుండెల, యెండిన పెదవుల
మధుకణమొక్కటి చిలకవులే

త్రావినవారే మరిమరి త్రావగ
వలదనినైనా పలకవులే

నీ విభజనలో న్యాయములేదే
హెచ్చులు తచ్చులు ఎక్కువలే
లెక్కకు మించిన ఆకలిడొక్కలు
ఆక్రందించిన ఉలకవులే

చీకటిమబ్బులు ఆకలిమంటలు
లోకమునిండా క్రమ్మినవి
రోదన వేదన పొంగిన జగమున
నీవే నవ్వుల మొలకవులే

అంతటి సృష్టికి నీవే మూలము,
వంతకు మూలము నీవేలే
తెలిసియు నిన్నే వలచెడి జనులకు
అందని వలపుల చిలకవులే

అంటీ అంటక ముట్టీ ముట్టక
అంతట నీవే ఉందువులే
తామసి లోగిల రోదసిలోపల
తరళిత నవశశి తిలకవులే

దేవుడు నీవై జీవుడు నేనై
విడివడి ఎన్నాళ్ళుండెదమే ?
నీవే నేనై నేనే నీవై
ఉందామంటే పలకవులే

ఈ భూకంపం ఈ జలదర్పం
ఈ ప్రళయాలు ఎందులకో!
మానవమాత్రుల మారణమునకై
మహిఋూనిన పెను అలకవులే!

కాలపథమ్మున కాళ్ళీడ్చే మా
కెప్పటికమ్మా విశ్రాంతి ?
తరతరాలకో యుగయుగాలకో
తగిలే ఒక చిరు మలకవులే !

మాయ బావిలో కూలినవాడిని
లాగేదెవ్వరు పై పైకి !
జ్ఞానపు త్రాటిని పరుగెత్తించెడి
సత్యము పేరిటి గిలకవులే !

8

అలనాడు చేసిన బాసలు :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?
చెలికాని తీయని సైగలు :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

నెలరాజు చల్లిన మల్లెలు,
వలరాజు దూసిన బాకులు,
కవిరాజు పాడిన పాటలు :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

గగనాలు నేలకు వాలుట,
లతకూన నింగికి ప్రాకుట
హృదయాలు ఊయెలలూగుట:
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

కలహాలతో విడిపోవుట,
విరహాలలో వసివాడుట
మరునాడు చెంతకు చేరుట :
అవి నీకు జ్ఞాపక మున్నవా ?

## జ్వాలా లేఖిని

చెలిచేత లేఖలు పంపుట,
ఎదలోని భారము దింపుట
మది నిండ ముద్దులు నింపుట :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

తనవారిపై పగబూనుట,
పెఱవారిపై వలపూనుట
ఏసిగించి ఏందులు చేయుట :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

ఎలమావి కొమ్మల కోయిల
పలుమారు ఈలలు వేయుట,
పొదరింట కోరిక పండుట :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

ఒకనాడు హృదయము మారుట,
పగబూని 'శరథి'ని దూరుట
పగవాని ఇంటికి చేరుట :
అవి నీకు జ్ఞాపకమున్నవా ?

# కన్నీట తడిసిన గజల్

**9**

(ముజీబ్ మరణవార్తవిని)

నాడు నేను నిద్దురలో పీడ కలలు చూశాను
మధుర భావ వాహినిలో విషపు టలలు చూశాను
కలలు నమ్మరాదంటూ మనసు గట్టి చేసుకుని
మనసు వెండి తెర మీద మంచు మలలు చూశాను
పీడ కలలు నిజమాయె, వీర వపుడు పడిపోయె
అతని ఇంటి వాకిలిలో తెగిన తలలు చూశాను
ప్రజాబంధు వేమాయె! ప్రణయ సింధు వేమాయె!
అతని బంధు మిత్రాళి 'గోరి' శిలలు చూశాను
రక్తమోడ్చి పోరాడి ముక్తి నొసగినా దతడు,
అతని తనువు తనువంతట ఇనుప ములలు చూశాను
త్యాగధనుల బ్రతుకులకు ఆ ముగింపు తప్పదనా ?
ఏసు, గాంధి మార్గంలో అతని నడలు చూశాను
చేదు నిజం చూశాను, వేదనలో మునిగాను
కంటి నీట తడిసిన ఈ ఒంటి గజలు వ్రాశాను

# రుబాయీ

'రుబా' అంటే అరబ్బీ భాషలో, నాలుగు అని అర్ధం. రుబాయీలో నాలుగు పంక్తులుంటాయి.

అట్లని ప్రతి నాలుగు పంక్తుల పద్యం రుబాయీ కాదు. దానికో ఛందస్సు, ప్రాస, అనుప్రాస వగైరా సరంజామా వుంటుంది.

ఫారసీ మహా కవి ఉమర్ ఖయ్యాం వల్లనూ, ఆయన కవితల్ని ఆంగ్లం లోనికి ఇంచుమించు అదే ఛందంలో అనువదించిన ఫిట్స్ జెరాల్డు వల్లనూ, రుబాయీకి విశ్వ విఖ్యాతి కలిగింది.

రుబాయీ రచనలో బాగా చేయి తిరిగిన మహా కవులున్నారు. వారిలో—ముఖ్యంగా హైదరాబాదులో—ప్రాతస్మరణీయులు—అమ్జద్ హైదరాబాదీ. ఆయన నుండి రుబాయీ ప్రక్రియను గురించి ఎన్నో విషయాలు తెలుసుకొన్న అదృష్టం నాకు దక్కింది. ఆయన పాల్గొనే ప్రతిముషాయిరాకూ వెళ్ళే వాణ్ణి.

నేను రచించిన కొన్ని రుబాయీలు చిత్తగించండి.

శిలనే ఒక అప్సరగా మలిచే వారు
చెలినే ఒక దేవతగా కొలిచే వారు
ఉన్నారు కొల్లలుగా ఈ లోకంలో
సతినే ఒక దయ్యంగా తలిచే వారు

నిప్పులోంచి అప్పుడప్పుడు పొగ పుడుతుంది
నీళ్ల లోంచి విద్యుత్తను సెగ పుడుతుంది
ఈ దానవ లోకంలో ఎన్నటికైనా
మానవులని పిలువదగిన తెగ పుడుతుంది

దాహానికి కావాలి నీరో మోరో
ప్రతి వారికి కావాలి ఊరో పేరో ;
ప్రాచీనులు వ్రాశారు నీళ్లే త్రాగి
నవ కవులకు కావాలి బీరో! బారో!

గుస గుసలే సరిగమలై వినిపిస్తాయి
అమవసలే పున్నమలై కనిపిస్తాయి
తొలి రాతిరి చెలి చెంతకు చేరిందంటే
చీకటిలో స్వర్గాలే కనిపిస్తాయి

జ్వాలా లేఖిని

చిరు నవ్వులు చిందిస్తూ చీట్లాడేను
అరమరికలు లేకుండా మాట్లాడేను
ఆ నవ్వులు, ఆ మాటలు వలపని తలచీ
అసలు విషయ మెత్తగానే పోట్లాడేను!

జన్మోత్సవ సంరంభం చేస్తున్నారు
బంధువులూ మిత్రులు నవ్వేస్తున్నారు
జీవితమున ఒక వర్షం గడచిన వేళ
దుఃఖించా లన్నది మరిచేస్తున్నారు

వంగ బంధువును దుష్టులు చంపేశారు
ప్రజా హృదయముల దుఃఖం నింపేశారు
ఇంతేనా లోకంలో ఎన్నటికైనా?
మానవతా పతాకాన్ని చింపేశారు

సకాలానికే సూర్యుడు ఉదయిస్తాడు
అందుకొరకె అతని నెవడు గుర్తిస్తాడు?
చలి కాలం రవి ఆలస్యంగా వస్తే
ఎండకొరకు మానవుడు పడి చస్తాడు!

చచ్చి బ్రతికి యున్నవారు కొందరు కలరు
బ్రతికి చచ్చినట్టి వారు ఎందరో కలరు
ఎంతెంతో వేదాంతం వల్లించేరు
మృతికి జడియబోని వారు ఎందరు కలరు?

పులి నుండి మేక నొకడు విడిపించాడు
నెనరుబూని ఇంటి దాక నడిపించాడు
ఆతడు కరుణామయుడని అనుకొనె మేక
కత్తి తీసి మేక మెడను ఖండించాడు

నాకు మతం లేదంటే-వుందంటారు
నాకు కులం లేదంటే-వుందంటారు
అలా వెళ్ళు అందమైన అంగన మీద
నాకు దృష్టి లేదంటే-వుందంటారు!

నాకు మమత వుందంటే-లేదంటారు
నాకు మనసు వుందంటే-లేదంటారు
ధనం మీద కాదు, మహాజనం మీదనే
నాకు ఆశ వుందంటే-లేదంటారు

నిర్భయంగా వచ్చాను, నిర్భయంగా వెళతాను
ఉచ్ఛ్వసిస్తూ వచ్చాను. నిశ్వసిస్తూ వెళతాను
మృత్యువు నృత్యం చూపి జడిపిస్తా రెందుకని?
భయమెందుకు? నా ఇంటికి నే వెళతాను

పదవి లేని వాడంటే ఎంతో అలుసు
మంత్రిగారి ఇంటి ముందు మనుషుల గొలుసు
హింసా వృత్తిని బూని, హంసలనే చంపి
రుధిరం త్రాగే వారికి మధువేం తెలుసు?

నీళ్ళలాగ కనిపించును పాత్రికలో మధువు
పసి పిల్లలాగ కనిపించును పందిట్లో వధువు
గొంతులోకి దిగి మధువు జ్వాలావళి రగిలిస్తే
సందిట్లో వధువు నేర్పు-వలపుల చదువు

ముసలివాణ్ణి కాను నేను-యువకుడ కాను
బడిలో అల్లరి చేసే బాలుడ గాను
శక్తి కొంత ఉడిగిందని శంకించేరా?
అబల పైన ఆశలేని అబలుడ గాను!

దురాశయే మానవుణ్ణి తుంచేస్తుంది
నిరాశయే మానవుణ్ణి ముంచేస్తుంది
దురాశలూ, నిరాశలూ పనికిరావులే
ఆశా జీవికి విజయం వచ్చేస్తుంది

ఊపిరినే నా సిరిగా భావిస్తాను
హృదయాన్నే సురపురిగా ఊహిస్తాను
సుదూరాన ఓహో! యని యెవరు పిలిచినా
నీవే, అను ఆశతోటి జీవిస్తాను

గడ్డి పరక మొలిచినా, కొమ్మ రెమ్మ వేసినా
పువ్వు పరిమళించినా, మొగ్గ తొంగిచూసినా
నా లోపల నవకవితే ప్రభవిస్తుంది
ముల్లుకాటు వేసినా, మెరుపుతీగ మెరిసినా

ప్రణయ పథం, కంటకితం: చూచి నడవరా!
అడుగుల్లో తడబాటును విడిచి నడవరా!
వలపులోన వగపుందను నిజం తెలుసుకో!
కొవ్వువత్తిలా కరగుట నేర్చి నడవరా!

చెలివద్దు, మధువు వద్దు, చషకం వద్దు
నదివద్దు, పడవ వద్దు, తీరం వద్దు
ఒకే ఒక్క అనుభూతిని ఆశిస్తాను
అనురాగం తప్ప, నాకు వేరేవద్దు

ఎలుగెత్తి దేవుణ్ణి పిలుస్తుంటారు
అయినా మొర వినలేదని గునుస్తుంటారు
తీస్తారు ప్రాణాలు, చేస్తారు దానాలు
పథ్యం చేయరు; ఔషధం సేవిస్తుంటారు!

మట్టి అంటిందని స్నానం చేస్తాము
పాపం అంటిందని దానం చేస్తాము
మనిషిని ఆఖరున తనలో దాచుకునేది
మట్టి-అనే మాటనే మరుస్తాము

ఊపిరి పీల్చినప్పుడేమో-జననం
ఊపిరి విడిచి నప్పుడేమో-మరణం
జనన మరణాల మధ్యలో దూరం
క్షణం-అన్న మాట తెలుసుకోవడం కఠినం

కలిమినాడు, లేమి మాట మరవకు
లేమినాడు, కలిమిమాట తలవకు
ఖుషిలో దిషిని చూడడం నేర్చుకో
అద్దంలో ముఖం చూచుకుని మురవకు

హనుమంతుని తోకంతటి అంకె ఉన్నది
అంకెకు అంకెకు నడుమ లంకె ఉన్నది
కోట్లు కోట్లు కోట్లంటూ లెక్కిస్తారు
అన్నిటిలో "ఒకటి"అనే అంకె ఉన్నది.

రోగి గారి బంధువొకడు రోదించాడు
రోదించి అలసిపోయి మరణించాడు;
ఏడ్పుగొడవ తగ్గగానె రోగం తగ్గి
రోగి కోలుకొని తుదకు జీవించాడు!

పానీయం వేరైనా దాహం ఒకటే
మోతాదులు వేరైనా మోహం ఒకటే
పంచేంద్రియ పరినిర్మిత పంజరమైనా
పంచప్రాణములున్నా, దేహం ఒకటే

చంద్రమండలం లా వెన్నెల పండిస్తుంది
సూర్య మండలం లా యెండలు మండిస్తుంది
ఆగ్రహాన్ని వీడి నను వరించు ననుకొని
విగ్రహించి వున్న నన్ను—దండిస్తుంది

వలపు బందిఖానాలో పడి వుంటాను
నా మీదే నేను కోపపడుతుంటాను
నన్నర్థం చేసుకోదు ఈ సమాజము
అర్థమవక-దాన్ని బాధ పెడుతుంటాను!

తీరం దూరం అయితే పోయిందేమి?
తుఫాను భయపెడుతుంటే మునిగిందేమి?
కడలితరగలే-మునగని పడవలు కాగా
విహరించే ఈ శరథికి భయమింకేమి?

ఆనందంతో అశ్రులు తాగేస్తారు
తప్పదుగా! జీవితాన్ని లాగేస్తారు
ఎవరి చేతిలో ఆడే తోలుబొమ్మలో?
ఆడమన్నరీతిగానే ఆడేస్తారు

శాపాలిస్తే నీవు సహించి ఊరుకో
దీవెనలిస్తే కైకొని హసించి ఊరుకో
సవాలుచేస్తూ లోకం నిను కవ్విస్తే
జబాబులివ్వక మౌనం వహించి ఊరుకో

పిచ్చోడివి పిచ్చోడివి అంటాడొకడు
మంచోడివి మంచోడివి అంటాడొకడు
భయపెట్టే శక్తిలేని నను పట్టుకొని
బూచోడివి బూచోడివి అంటాడొకడు

తనవారినే పెరవారని అనుకోవాలా?
సులభాన్నే దుర్లభమని అనుకోవాలా?
నమ్మరాని ఈ లోకాన్నెలా నమ్మడం?
సౌఖ్యాన్నే దుఃఖంగా అనుకోవాలా?

వయసులాగ కాంతి కూడ వెళిపోతుంది
కమ్మనైన కథ కంచికి వెళి పోతుంది
ఎంత దారుణం! శరథీ! ఈలోకంలో
నర రుధిరమె నరునికి మధు వయిపోతుంది!

మంచి వాణ్ణి పిచ్చివాణ్ణి చేసేదానా!
ఇష్టముండి లేనట్టుగి చూసేదానా!
ఉత్తరాలు వ్రాయక నన్నుడికిస్తావే
బొటన వ్రేలితో నేలన వ్రాసేదానా!

తప్పుతోటి ఒప్పుకలిసి తప్పవుతుంది
నదినీరు కడలిచేరి ఉప్పవుతుంది
పెనుగాడుపు వీచినపుడు దివ్వె ఆరినా
అగ్గిరవ్వ ఊరు కాల్చు నిప్పవుతుంది

గొడ్డలితో నరికినా రంపంతో కోసినా
సాన రాతిమీద వేసి అరగతీసినా
సుగంధమే చిందుతుంది చందనం
నిప్పుల్లో కాల్చి బూది చేసినా

కణకణమూ మైకంతో సోలుతున్నది
ప్రతితృణమూ అశాంతితో తూలుతున్నది
శాంతి యేది దేనికైన ఈలోకంలో?
పువ్వుగూడ జ్వాలవోలె కాలుతున్నది

నిత్యం మృత్యువు వార్తలు రావద్దు
సత్యాహింసల మాటలు మరవద్దు
నిండు ప్రాణములు తీయుట మనిషికి తగదు
బండగుండె యముని పనిని మనిషి చేయొద్దు

మోదుగు పువ్వు జండాలు ఎగిరాయి
ఎదలో వలపుల జ్వాలలు రగిలాయి
కొత్త కొత్తగా వుంది పాతలోకము
ముళ్ళుగూడ పూలవోలె మురిసాయి

ధరలో వున్నన్నాళ్ళూ ధరలు తప్పవు
ధరలు పెరిగి నిరుపేదల చెరలు తప్పవు
చాలీచాలని జీతం సంసారికి భూతం
అవసరాలు తీరక అరగొరలు తప్పవు

నరకాన్నే చేయాలి స్వర్గఖండము
విషం విరిగి, అందాలి అమృత భాండము
హృదయంలో అనురాగం ఇగురించేలా
మదనుడు చేబూనాలి ఇక్షుదండము

గాలిని పిడికిట పట్టాను
గగనాన్ని చేలితో ముట్టాను
యెవరికి అందని ఆ జవరాలి
హృదయం తలుపులు తట్టాను

పూలైతేం? ముళ్ళైతేం? చాచాను దోసిలి
మౌనంటేం? కాదంటేం? కోరాను కౌగిలి
మేఘాలే క్రమ్మినా, వర్షాలే కురిసినా
వెన్నెలలే చిందుతుంది చెలి మోము జాబిలి

అగ్ని గీతములు హృదయం గానం చేసె
ప్రేమ మార్గమున ముళ్ళే ప్రాణం తీసె
అయినా జీవిత గహనారణ్యం మనదే
రాళ్ళూ పూలు కాళ్ళకు పూజలు చేసె

నేరం ఆరోపించే కోరిక లేదు
నేరస్థుల దండించే తీరిక లేదు
క్షమించడం, శమించడం నేర్పిన నాతో
దెబ్బకు దెబ్బను వారికి పోలిక లేదు

## జ్వాలా లేఖిని

చేతికి బేడీలు వేసి నడిపె జీవితం
కాళ్ళకు బంధాలు వేసి త్రిప్పె జీవితం
కారా గృహ కుడ్యాలే అడ్డం వున్నా
అవతలి లోకాన్నంతా చూపె జీవితం

విరిసిన ప్రతి ప్రసూనము పరిమళించును
వయసొచ్చిన ప్రతి చిన్నది అందగించును
అది శాశ్వత మనుకుంటే చాలా తప్పు
ఆరిపోవు దివ్వె మరీ వెలుగు నించును

అశ్రు మౌక్తికాలునీకు కానుక లిచ్చాను
కవితావజ్రాలు నీకు కానుక తెచ్చాను
హృదయ సంపదంతా నీ కంకిత మాయె
ఆఖరుకి ప్రాణాలే కొని వచ్చాను

ప్రేమించే వారినేమొ ద్వేషిస్తారు
భూషించే వారినేమొ దూషిస్తారు
ఈ విచిత్ర భూమండలి ఎందుకిలాగ?
చేయని నేరాలకేమొ శిక్షిస్తారు

వాహ్యాళికి వనవాటికి వస్తున్నావు
విచ్చీ విచ్చని మొగ్గలు కోస్తున్నావు
మనిషి గుండెనే కోసే నిర్దయురాలా!
లేత లేత పూలు కాల రాస్తున్నావు

ఆరబోని దివ్వె నీవు వెలిగించాలి
వాడబోని తోట నీవు మొలిపించాలి
జాతి కొఱకు నీ తనువును అర్పించేసి
చావును నీ బ్రతుకునుండి తొలగించాలి

ఎండలో నిలిచి చెట్టు, నీడనిచ్చును
తన బాధను మరచి, త్యాగి తోడునిచ్చును
వాడి వత్తలై పోయిన వనములోనికి
వసంతుడడుగిడ గానే మోదు విచ్చును

దానిమ్మ, పండువోలె సూరీడు
సాయం సంధ్యావేళను మారాడు
అతన్ని తెంచుకునే శక్తి యెవరికున్నది?
గగన శాఖనుండి పండి రాలాడు.

—o—

# జ్వాలా లేఖిని

తెల్లకాగితం మీద నల్లక్షరాలు వ్రాస్తుంది సాదా లేఖిని
నల్లని చీకట్లమీద నవకాంతి కవితలు వ్రాస్తుంది జ్వాలా లేఖిని
ఈ జ్వాలా లేఖిని లోని యెర్ర సిరాయే — స్నేహం;
ఈ స్నేహదీపం వెలిగిననాడే — పుణ్య గేహం;
మమతల మతాబాలు, నవ్వుల అవ్వాయి చువ్వాలు
వెచ్చని వలపుల చిచ్చుబుడ్లు, మెత్తని తలపుల కాకరపొత్తులు
వెలుతురుల, వెచ్చదనాల కౌగిళ్లలో
ఒక్కరాత్రి మరపురాని చక్కిలిగింతలు !
రేపు మళ్ళీ గాఢాంధకార గజేంద్రాల కాళ్ళకింద నలిగే
లేత గుండెల పారిజాత మాలికలు;
మళ్ళీ వేదనలు, వాదనలు, రోదనలు, శోధనలు
కళ్ళలోని అశ్రుగంగా ఝరీ తరంగ రంగం మీద విప్లవతాండవాలు
రణబీజాలు వెదజల్లే, మృత్యు కేదారాలు పండించే ఉన్మాదులు
దివ్వెలార్పేస్తూ, పువ్వులు నలిపేస్తూ
నవ్వుల్ని చితిమంటల్లో మసిచేస్తూ
విశ్రుత విహారం చేస్తున్నారు విశ్వవీధుల్లో;

వాళ్ల పాదాలకింద మొగ్గలు బుగ్గి అవుతున్నాయి
వాళ్ల తుపాకీ గుళ్లకు కుటుంబాలు కూలిపోతున్నాయి
ఈ ఆశ్వయుజ అమావాస్య అంధకారంలో
దివ్వెలు వెలిగించే దివ్య హస్తాలకోసం అన్వేషిస్తున్నాను;
సప్తవర్ణాల కంకణాలతో
సప్తస్వరాల కింకిణులతో
ప్రతిదినం దీపాలు వెలిగిస్తూ
భద్ర మహిళలు నడయాడే
మంగళ ప్రపంచంకోసం
కలలుకంటూ చీకట్లో కూచున్నాను;
ఈ జ్వాలా లేఖిని ఆరిపోదు
ఇందులోని చైతన్య మషీపంకం ఇంకిపోదు.

—౦—